# బ్రహ్మ వైవర్త మహా పురాణం

- శ్రీ మట్టుపల్లి శివ సుబ్బరాయ గుప్త

్తీయ ముద్రణము

ువ ఆషాఢ పూర్ణిమ

ుపూర్ణిమ 12-6-95

# SREEMAD BRAHMA VYVARTH MAHAPURNA SARA SANGRAHAMU

By

'Pouranika Ratna'

'Mahapuranandhrikaranachana'

**Sri Mattupalli Siva Subbaraya Gupta**



పుస్తకములు లభించు ప్రదేశములు :

. శివా ఇంజనీరింగ్ కంపెనీ
స్టేషన్‌రోడ్, గుంటూరు-522 001
ఫోన్ : 220827

2. శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త,
మట్టుపల్లివారివీధి కొత్తపేట,
గుంటూరు-522 001.
ఫోన్ : 223827



శ్రీరస్తు    ఓం నమః    శుభమస్తు

శ్రీ విఘ్నేశ్వరాయనమః

# వక్తవ్యము

---

లం నీలామ్బుదాభమతిశయరుచిరం స్మేరవక్త్రామ్బుజాభం
బ్రహ్మేశానన్తధర్మైః కతి కతి దివసైః స్తూయమానం పరం యత్।
నాసాధ్య మృషీన్ద్రైర్మునిమనుజవరైః సిద్ధసంఘైరసాధ్యం
గీన్ద్రాణామచిన్త్యమతిశయమతులం సాక్షిరూపం భజేఽహమ్॥

నల్లనిమేఘమువలె మిగుల సుందరుడైనవాడు, చిరునవ్వు గూడిన ముఖపద్మముగలవాడు; ఈశానుడు, అనంతుడు, ధర్మదేవుడు మొదలగు దేవతలచే బహుదినముల నుండి సేవింపబడుచున్నావాడు; ఋషీంద్రుల ధ్యానమున కసాధ్యమైనవాడు; మునులు, మనుజవరులు, సిద్ధులు, మున్నగు వారికి సాధ్యుడైనవాడు; యోగీంద్రుల కచింత్యుడు, సర్వ విషయములలోను వరేణ్యుడు, సాటిలేనివాడు, సాక్షిరూపుడు నగు బాలముకుందుని సేవించుచున్నాను.”

నేడు మానవసమాజములో నింత భేదభావములు, అస మానతలు, అశాంతి, ద్వేషము, మాత్సర్యము, మదము, మోహాదులు వ్యాపించియుండుటకు గారణమేమియని ప్రశ్నించు కొనిన నిరీశ్వరవాదమే యీ యుపద్రవములకు బీజ మైనట్లు తెలియుచున్నది. భగవంతు డున్నాడు. ఒక శక్తివంత మైన నిత్యతత్త్వమునుండియే యీ యసంఖ్యాకజగత్తులు బయల్వెలి అద్దానిచే పాలన మొనరింపబడి తుద కాశక్తిలోనే విశ్రమిం చున్నవి. ఈ ప్రకారముగ సృష్టిస్థితిప్రళయము లనాదికాలము నుండి సంభవించుచున్నవి.

భౌతిక విజ్ఞానద్వారమున సృష్టి రహస్యములను దెలిసి కొనుటకు మానవు డవిరళకృషి యొనరించుచున్నాడు, కృషి యాకృషియపర్యాప్తముగనే యుండెను. ఈ సమస్తమునై యండపిండ బ్రహ్మాండములకు గారణమై వీటి యన్నిటిని భ్రమింపజేయుచున్న నొక దివ్యశక్తి కలదనుట నిర్వివా దాంశము. ఆ శక్తిని ఆ శక్తికే కారణమైనశక్తిమంతుని యీ శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణములో నత్యంతవివేకపూర్ణ ముగ సాధికారికముగ, శ్రీకృష్ణద్వైపాయన వ్యాసదేవులు పరిపూర్ణముగ వర్ణించిరి.

అష్టాదశమహాపురాణములలో నొకటి యగు నీ మహా పురాణ మొకయతీంద్రియ విజ్ఞానము. కేవలము సృష్టిరహస్య

ములనేగాక భగవంతునితో దేహధారులమైనమన సంబంధము లెట్లుండవలెనో, జగములను పూర్ణజ్ఞానవంతులుగ నొనరింప వలెనన్న, మానవ సమాజము పరిపూర్ణత్వమును బొందవలె నన్న మన కర్తవ్యము లేవో యీ గ్రంథరాజములో నత్యంత మనోహరముగ, నిర్దుష్టముగ బ్రతిపాదింపబడినవి. సంస్కృత భాషావైభవసంపన్న మగు నీ యుద్గ్రంథ మాసర్వేశ్వరేశ్వ రుని గృపచే ఆంధ్రవాఙ్మయమునం దత్యంతవిపులముగ లిపిబద్ధ మొనరించి సమర్పించుచున్నాము. ప్రస్తుత మీచిఱు పొత్తములో నా మహాగ్రంథసారమును మీరు గ్రహింపగలరు. అనతికాలములోనే యా దివ్యగ్రంథమును శ్రీమదాంధ్రి బ్రహ్మవైవర్త మహాపురాణముగ సర్వాంగ సుందరముగ బ్రచురింపగలము.

ఎట్టి వ్యక్తియైన నీపవిత్రగ్రంథపఠనమాత్రముననే, శ్రవణ మాత్రముననే ఆధ్యాత్మిక జ్ఞానమును యథాతథముగ బొంది సంస్కృతుడగుటయేగాక నానాప్రకారవ్యర్థవాగ్జాలములలో దగిలియున్నవారిని, క్షణికసిద్ధాంతము లనెడు కావనములలో భ్రమించువారిని దృఢవిశ్వాసయుక్తులగు దైవభక్తులుగ సచ్చరితులుగ మార్చగలదు. ఇట్లు సనాతనధర్మము పునః ప్రతిష్ఠితము కాగలదు. దుష్యంతుడు మహాసాధ్వి యగు శకుంతలను మఱచి ప్రవర్తించునట్లు నేడు మానవసమాజము మన స్వధర్మ మగుసనాతనధర్మమును విస్మరించి యాత్మ

విస్మృతికి లోనై యున్నది. అనేకములగు సంధవిశ్వాసముల నడుమ భ్రమించుచు సత్యమును దర్శింపలేకయున్నది. ఈ శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణ మనునవ్యాస్త్రము మానవుల ఆత్మవిస్మృతిని ఖండించి, ఆత్మసాక్షాత్కారమును ప్రసాదింపగలదు.

ప్రపంచములో మానవుడెదుర్కొనుచున్న ప్రశ్నలన్నింటికిని నిందు సమాధానములు లభించును. ఈ మహాగ్రంథము సృష్టిరహస్యములను వెల్లడించుచు సృష్టికాధారమైన యనంతశక్తితత్త్వమును బ్రతిపాదించి, యయ్యాదిశక్తినే ధరించిన సకలకారణకారుడు, విశ్వంభరుడు, విశ్వవ్యాపకుడు, భక్తానుగ్రహకాతరుడు, సచ్చిదానందవిగ్రహుడు నగుభగవంతుని పరిపూర్ణ దివ్యసత్యనిత్యజ్ఞానానందశుద్ధబుద్ధస్వరూపమును పాఠకులచే దర్శింపజేయును.

ఈ యమూల్యరత్నరాజమును నింతకుముందెవ్వరును నింతవిపులముగ ఆంధ్రవాఙ్మయమునకు సమర్పింపలేదు. ఆ సౌభాగ్యము నాకు భగవత్కృపవలన లభించినది. నన్ను నిమిత్తమాత్రునిగ వినియోగించి భగవంతుడు నాచే నాంధ్రీకరింప జేయించిన యీ మహాపురాణము సకలమానవసమాజములో, విశేషముగ విద్యార్థులలో, ఆధ్యాత్మికజ్ఞానమును, నైతిక

విలువలను, భగవద్భక్తిని, నిష్కామకర్మను, ధైర్యస్థైర్యాదులను నుద్దీపింపజేయగలదు. ఎనుబదినాల్గులక్షల జీవరాసులలో భ్రమించినపిదప జీవునకు మానవజన్మము లభించును. దయామయుడైన నాభగవంతుడు మనకు వివేచనాజ్ఞానమును బ్రసాదించెను. క్షుద్రజంతువులవలె మానవుడు కేవలము తన శరీర పోషణలోనే, తుచ్ఛములైన నైహిక సుఖములలోనే తన అపూర్వమానవజన్మమును నిష్ఫల మొనరించుకొనవలెనా? మానవులు తమ జన్మమును సాఫల్యమెట్లొనరించుకొనవలెనో ఈగ్రంథాధ్యయమువలన క్షుణ్ణముగ తెలిసికొనగలరు. కావున నీ పవిత్రగ్రంథము విద్యాలయములలో ప్రబోధింపబడినచో, విద్యార్థులలో నేడు తాండవించుచున్న నశాంతి తొలగి యాత్మవిశ్వాసము ధైర్యము, సత్యతత్త్వపరిజ్ఞానము, భక్తి వినయవిధేయతలు, నైతికవిలువలు జాతీయభావములు, విశ్వమానవసౌభ్రాతృత్వము మొదలగు దివ్యగుణములు నిశ్చయముగ బెంపొందగలవు.

ప్రస్తుతగ్రంథమున నత్యంతప్రభావసమన్వితములైన వివిధ దేవతలకు సంబంధించిన మంత్రములు, స్తోత్రములు, కవచములు, భక్తుల యుపయోగార్థమైసంపూర్ణగ్రంథ మగునీ శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమునుండి సంగ్రహించి చేర్చితిమి. వీనిని నిత్యము పారాయణక్రమమున నుంచుకొన్న

వారికి సర్వాభీష్టములు సిద్ధించు ననుటలో నెట్టి సందేహమును లేదు. దానితోపాటు వారి తాపత్రియములుగూడ దొలగును. ఈ మంత్రస్తోత్రకవచ పారాయణములవలన గలుగు ఫలములను బ్రత్యక్షగము జూచుచుండుట జరుగుచున్నది. కావునమా యీ ప్రస్తుతకృషిని, భవిష్యత్కృషిని సఫల మొనరింప వలసినదిగ భక్తులైన పాఠకులను సవినయముగ బ్రార్థించు చున్నాము.

ఇట్లు

భక్తజన దాసానుదాసుడు

మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

గుంటూరు
25-5-1978

# విషయసూచిక

శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణ సారసంగ్రహము 1 - 37

వివిధదేవతా మంత్రస్తోత్రకవచ సంగ్రహము

శ్రీగణేశ్వర మంత్రస్తోత్ర కవచములు :

శ్రీగణేశ్వర మహామంత్రము 38

శ్రీవిష్ణుకృతం శ్రీగణేశ్వరస్తోత్రమ్ 38 - 40

శ్రీగణేశ కవచమ్ 41 - 43

శ్రీదుర్గామంత్రస్తోత్ర కవచములు :

శ్రీదుర్గామహామంత్రము 43

శ్రీకృష్ణకృతదుర్గతినాశని శ్రీదుర్గాస్తోత్రమ్ 43 - 46

బ్రహ్మాండవిజయం నామ శ్రీదుర్గాకవచమ్ 47 - 49

జానకీకృతం శ్రీపార్వతీ స్తోత్రమ్ 49 - 51

శ్రీశివ మహామంత్రస్తోత్ర కవచములు :

శ్రీశివ మహామంత్రము 51

హిమాలయకృతం శ్రీశివస్తోత్రమ్ 51 - 53

బ్రహ్మాండవిజయ శివ కవచమ్ 53 - 56

శ్రీకృష్ణ మహామంత్ర స్తోత్ర కవచములు :

శ్రీకృష్ణస్య సప్తదశాక్షరో మన్త్రః 57

బ్రహ్మణాకృతం శ్రీకృష్ణస్తోత్రమ్ 57 - 59

శ్రీ త్రైలోక్యవిజయ కవచమ్ 60 - 63

శ్రీరాధామంత్రస్తోత్ర కవచములు :


శ్రీరాధా మహామంత్రము 64

ఉద్ధవకృత శ్రీరాధా స్తోత్రమ్ 64 - 67

శ్రీ రాధా కవచమ్ 68 - 70


శ్రీమహాలక్ష్మి మహామంత్రస్తోత్ర కవచములు


శ్రీమహాలక్ష్మి షోడశాక్షర మంత్రమ్ 71

ఇంద్రకృతం శ్రీమహాలక్ష్మి స్తోత్రమ్ 71 - 73

సర్వైశ్వర్యప్రదం శ్రీమహాలక్ష్మి కవచమ్ 74 - 76


శ్రీసరస్వతీ మహామంత్రస్తోత్ర కవచములు


శ్రీసరస్వతీ మహామంత్రము 76

శ్రీయాజ్ఞవల్క్యకృత శ్రీవాగ్దేవతా స్తోత్రమ్ 76 - 78

విశ్వజయంనామ శ్రీసరస్వతీ కవచమ్ 79 - 82


శ్రీసూర్యమంత్రస్తోత్ర కవచములు


శ్రీసూర్యమహామంత్రమ్ 82

శ్రీ సూర్యస్తోత్రమ్ 82 - 83

జగద్విలక్షణంనామ శ్రీసూర్యకవచమ్ 83 - 85

మంత్రసహితం శ్రీకాళికా కవచమ్ 86 - 88

శ్రీరస్తు ఓంనమః శుభమస్తు

శ్రీగణేశ్వరాయ నమః

ఓం శ్రీం హ్రీం క్లీం శ్రీగణేశ్వరాయ బ్రహ్మరూపాయ చారవే
సర్వసిద్ధి ప్రదేశాయ విఘ్నేశాయ నమోనమః.

# శ్రీమద్బ్రహ్మవైవర్త
# మహాపురాణసారసంగ్రహము

శ్లో॥ వన్దే కృష్ణం గుణాతీతం పరం బ్రహ్మాచ్యుతం యతః ।
అవిర్బభూవుః ప్రకృతిబ్రహ్మవిష్ణుశివాదయః ॥

(బ్రహ్మఖండము 1-4)

ఎవనినుండి ప్రకృతి, బ్రహ్మ, విష్ణు, శివాదులావిర్భవించిరో, ఆత్రిగుణాతీతుడు, పరబ్రహ్మము, బరమాత్మ, అచ్యుతుడునగు, శ్రీకృష్ణునకు నేను నమస్కరించెదను.

శ్లో॥ ధ్యాయన్తే ధ్యాననిష్ఠాః సురనరమనవో యోగినో యోగరూఢాః
సన్తః స్వప్నేపి సన్తం కతికతిజనిభి ర్యం న పశ్యన్తి తప్త్వా ।
ధ్యాయే స్వేచ్ఛామయం తం త్రిగుణపర మహానిర్వికారం నిరీహం
భక్తధ్యానైకహేతో ర్నిరుపమరుచిరశ్యామరూపం దధానమ్ ॥

(బ్రహ్మఖండము 1-3)

ధ్యానపరాయణు లైన దేవతలు, మనుష్యులు, స్వాయంభువు లైనమనువులు మొదలైనవా రెవనిని ధ్యానిం

చెదరో, యోగసిద్ధులైనమహాయోగు లెవనిని సదా ఆరాధించెదరో, జాగ్రత్స్వప్ననిద్రావస్థలయం దంతట విద్యమానుడై యున్న యాపరమేశ్వరుని సాధకు లనేకజన్మల యందు దపము నాచరించియు గానలేకున్నారో, ఆత్రిగుణాతీతుడైన, స్వేచ్ఛామయుడైన, నిర్వికారుడైనపరమాత్మ కేవలము త న్నాశ్రయించిన యనన్యభక్తజనులకొఱకే, వారికి స్వధామమును ప్రసాదించుటకొఱకే, నిరీహమైన, పరమమనోహరమైన శ్యామసుందరరూపమును ధరించెను. అట్టిశ్రీకృష్ణుని నేను ధ్యానించెదను.

శ్లో॥ వదన్తి తత్తత్త్వవిదస్తత్త్వం యద్జ్ఞాన మద్వయమ్ ।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే ॥

(భాగవతము-ప్రథమస్కంధము-2వ అధ్యాయము శ్లో-11)

బ్రహ్మము, పరమాత్మ, భగవాను డనునీదివ్యనామములు కేవల మొకేయొక అద్వయపరమదివ్యనిత్యసత్యతత్త్వమునకే క్రమముగ లీలానురూపము లైనమూడు నామములు. మహాజ్ఞానసంపన్నులు, సత్యతత్త్వవిదులు నైనభక్తాగ్రగణ్యులు నిత్యసత్యమును బరిపూర్ణముగ దెలిసికొని, ఆసచ్చిదానందమయుని బరబ్రహ్మమని, పరమాత్మయని భగవాను డనికీర్తించిరి.

ఈపరమతత్త్వయుక్తుడైనభగవంతుని భ్రుకుటివిలాసమాత్రముననే లీలగ సర్వజగన్నిర్మాణము, పాలనము,

సంహారము సంభవించును. సచ్చిదానందవిగ్రహుఁడైన భగవంతుఁడు ప్రాకృతగుణరహితుఁడైననిర్గుణుఁడు, సర్వేశ్వరేశ్వరుఁడు, సర్వశక్తిసమన్విత యైనఆద్యప్రకృతి కర్తృకుఁడు. పరబ్రహ్మమనగా అఖండజ్యోతిస్స్వరూపము; పరమాత్మయనగా సకలజగములందు చరాచరజీవుల హృదయాంతరంగముల యందు, లోపల, బయట అంతట నిండియున్న సర్వేశ్వరుఁడు. భగవానుఁ డనగా అఖండజ్యోతిఃపుంజమునకు గారణుఁడు; బ్రహ్మజ్యోతి యాదివ్యపురుషునినుండియుద్భవించినదే. యోగులద్దానియందే యేకీభావము పొందెదరు. సర్వత్ర నిండియున్న భగవంతుని దివ్యనామమే పరమాత్మ. సర్వకారణకారణుఁడై బ్రహ్మజ్యోతితో బ్రకాశించు సచ్చిదానందవిగ్రహమే భగవానుఁడు. అనన్యభక్తజను లకుంఠ భక్తియోగసాధనద్వారమున దమ హృదయాంతరంగమం దున్నపరమాత్మను దెలిసికొనుటయేగాక, బ్రహ్మజ్యోతికి కారణభూతుఁడై, సనాతనుఁడై, పరమాత్మయై, ప్రాకృతగుణరహితుఁడై, దివ్యగుణసంపన్నుఁడై, స్వస్వరూపస్థితుఁడైనసచ్చిదానందమయవిగ్రహుని దర్శించి సేవించి దివ్యపరంధామమును జేరెదరు.

భగవంతుఁడు సర్వస్వతంత్రుఁడు, సమస్తకారణకారణుఁడు; సర్వబీజస్వరూపిణి యైనఆద్యప్రకృతి మహాప్రళయకాలమందు భగవంతునియందే విలీనయగును. భగవంతుఁడు సృష్టికొఱకు సంకల్పించిన బ్రకృతి ఆయననుండి ప్రాదుర్భ

వించి, జగన్నిర్మాణమందు క్రియాశీల కాగలదు. ఈప్రకృతి భగవంతునకు భిన్నశక్తి కాదు. అగ్నియందు దాహశక్తి యెట్లుండునో అట్లే లీలగ ప్రకటాప్రకటరూపముల ప్రకృతి భగవంతునియందే యుండును. పరమాత్ముని యిచ్ఛాను సారముగనే విభిన్నరూపములు గల యీ యద్భుతసృష్టి ప్రాదుర్భవించును. శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమందా పరబ్రహ్మమైన, పరమాత్ముడైన, సచ్చిదానందవిగ్రహుడైన భగవంతుని దివ్యనామమే శ్రీకృష్ణుడు. పరమోత్కృష్టమైన, పవిత్రాతిపవిత్రమైన, దివ్యాతిదివ్యమైన, చిన్మయమైన, నిత్యమైన, సత్యమైనగోలోకపరంధామమే శ్రీకృష్ణ భగవానుని లీలాధామము. నిర్గుణపరబ్రహ్మస్వరూపమై, నిరాకారమైనయఖండతేజోమండలమధ్యమున అనంతకోటి సూర్యప్రకాశసమన్వితుడు, పురుషోత్తముడునైనశ్రీకృష్ణ భగవానుడు నిత్యము విరాజమానుడై యుండును.

ఆ భక్తానుగ్రహవిగ్రహుని దివ్యరూప మత్యంతసుంద రము, రమణీయము, పరమమనోహరము. ఆ నిత్యనవకిశో రుడు జలజభవాదిదేవమునిసన్నుతతీర్థపాదారవిందుడు, నిర్మల నవరత్ననూపురవిరాజితకౌస్తుభభూషణాలంకృతుడు, సము జ్జ్వలతులసీకురంగమదవాసనావాసితదివ్యదేహుడు, శ్రీనిలయ శరీరుడు, భానుశశాంకలోచనుడు, శ్రీరాధాహృదయస్థితుడు, సకలపాతకహరుడు, సర్వలోకపావనుడు, భువనాతీతగుణాశ్ర యుడు, శ్రీవత్సాంకితకౌస్తుభస్ఫురితరాధాచారువక్షస్స్థల(శ్రీ)

విభ్రాజితుడు, నవీననీరదశ్యామలవర్ణుడు, రాజీవనయనుడు, ద్విభుజుడు, మురళీగానవినోది, అనంతకోటిసూర్యప్రకాశ సమన్వితుడు.

శ్రీకృష్ణుడు సర్వజీవుల కేకైకాశ్రయుడు, సమస్త శక్తులకు మూలపురుషుడు, సర్వాతీతుడు, సర్వవ్యాపి, పరిపూర్ణతము డైనపురుషోత్తముడు. అనన్యభక్తిని, దాస్యసౌభాగ్యములను, సమస్తైశ్వర్యములను ప్రసాదించుటయే శ్రీకృష్ణుని స్వభావము. సకలసృష్టికి స్రష్ట యైనబ్రహ్మదేవుని యాయుర్దాయ మీపరమపురుషున కొకనిమేషకాలము మాత్రమే.

శ్లో॥ కృషిరుత్కృష్టవచనో ణశ్చ సద్భక్తివాచకః ।
అశ్చాపి దాతృవచనః కృష్ణం తేన విదుర్బుధాః ॥
కృషిశ్చ పరమానన్దే ణశ్చ తద్దాస్యకర్మణి ।
తయోర్దాతా చ యో దేవస్తేన కృష్ణః ప్రకీర్తితః ॥
కోటిజన్మార్జితే పాపే కృషిః క్లేశే చ వర్తతే ।
భక్తానాం ణశ్చ నిర్వాణే తేన కృష్ణః ప్రకీర్తితః ॥
సహస్రనామ్నాం దివ్యానాం తిరావృత్త్యా చ యత్ఫలమ్ ॥
ఏకావృత్త్యా తు కృష్ణస్య తత్ఫలం లభతే నరః ॥
కృష్ణనామ్నః పరం నామ న భూతం న భవిష్యతి ।
సర్వేభ్యశ్చ పరం నామ కృష్ణేతి వైదికా విదుః ॥
కృష్ణ కృష్ణేతి హే గోపీ యస్త్వాం స్మరతి నిత్యశః ।

జలం భిత్త్వా యథా పద్మం నరకాదుద్ధరేచ్చ సః ॥
కృష్ణేతి మఙ్గలం నామ యస్య వాచి ప్రవర్తతే ।
భస్మీభవన్తి సద్యస్తన్మహాపాతకకోటయః ॥
అశ్వమేధసహస్రేభ్యః ఫలం కృష్ణజపస్య చ ।
వరం తేభ్యః పునర్జన్మ నాతో భక్తపునర్భవః ॥
సర్వేషామపి యజ్ఞానాం లక్షాణి చ వ్రతాని చ ।
తీర్థస్నానాని సర్వాణి తపాంస్యనశనాని చ ॥
వేదపాఠసహస్రాణి ప్రాదక్షిణ్యం భువః శతమ్ ।
కృష్ణనామజపస్యాస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥

(శ్రీబ్రహ్మవైవర్తము-శ్రీకృష్ణజన్మఖండము 111. 32-41)

'కృషి' ఉత్కృష్టవాచకము, 'ణ' సద్భక్తివాచకము, 'అ' దాతృవాచకము. ఉత్కృష్టమైనసద్భక్తిని బ్రసాదించు దైవముగావున భగవంతుని విద్వాంసులు గృష్ణుడందురు. 'కృషి'యనగ పరమానందము, 'ణ'దాస్యసౌభాగ్యము. ఈ రెండింటిని బ్రసాదించు దైవమునే కృష్ణుడందురు. జీవుల కోటిజన్మార్జితపాపపుంజములు, క్లేశములు 'కృషి'శబ్దార్థము. 'ణ'ఆసర్వపాపముల వినాశవాచకము. భక్తుల పాపక్లేశములను నశింపజేయువాడు గావున భగవంతుని గృష్ణుడనికీర్తింతురు. సహస్రదివ్యనామములను మూడుపర్యాయములు జపించిన నేఫలము ప్రాప్తించునో ఆ ఫల మంతయు కేవల మొకేయొకసారి కృష్ణనామ ముచ్చరించిన మనుష్యునకు సుల

భముగ లభింపగలదు. విద్వాంసు లైనవేదవిదుల కథన మేమ
నగ గృష్ణదివ్యనామముకంటే ఉత్కృష్టము మఱియొకటిలేదు,
ఉండదు, ఉండబోదు. 'కృష్ణ', 'కృష్ణ' యనుచు నిత్యము
స్మరించు మానవుడు జలములను భేదించి కమల ముద్భవించు
నట్లు నరకమునుండి యుద్ధరింపబడగలడు. కృష్ణ యనుమంగళ
నామ మెవని వాణియందు యుండునో వాని కోటానుకోట్ల
మహాపాతకము లాక్షణమునందే భస్మములు కాగలవు. కృష్ణ
నామజపఫలము సహస్రాశ్వమేధయజ్ఞముల ఫలములకంటే
నత్యంతశ్రేష్ఠము; ఎందువలెననగా యజ్ఞములవలన మరల
జన్మము ప్రాప్తించును; కాని శ్రీకృష్ణనామజపము భక్తులను
జననమరణచక్రమునుండి విముక్తుల నొనరింపగలదు. సమస్త
యజ్ఞఫలములు, లక్షాధికవ్రతఫలములు, తీర్థస్నానఫలములు,
సర్వతపఃఫలములు, ఉపవాసవ్రతఫలములు, సహస్రవేదపాఠ
ఫలములు, వందలాదిగజేసిన పృథ్వీప్రదక్షిణాఫలములు మొద
లగునవన్నియు శ్రీకృష్ణనామసంకీర్తనఫలమందు బదునాఱవ
యంశమునకైనను సరిరావు.

'కృష్'సర్వార్థవాచకము, 'ణ'అనగ బీజమని అర్థము;
సర్వబీజస్వరూపుడు, పరబ్రహ్మము, పరమాత్మయు నగుభగ
వంతునే కృష్ణు డనిభక్తజనులు సంకీర్తన మొనరింతురు. జగ
న్నిర్మాణమునకుసంకల్పించి భగవానుడగు శ్రీకృష్ణుడు స్వయ
ముగ రెండురూపముల బ్రకటితు డయ్యెను. ప్రథమరూపము

పురుషుడు, రెండవరూపము ప్రకృతి. ఆ మూలప్రకృతియే శ్రీరాధ. ఆమె పరబ్రహ్మస్వరూపిణి, నిత్యసనాతని. ఆద్య ప్రకృతియు ఈశ్వరీశక్తియునగు శ్రీరాధ యైదురూపముల ప్రాదుర్భవించెను. 1. శివస్వరూపిణి, నారాయణి, సంపూర్ణ బ్రహ్మస్వరూపిణి, భగవతిదుర్గ. 2. శుద్ధసత్త్వస్వరూపిణియైన శ్రీహరిశక్తి, సర్వసంపదలకు నధిష్ఠాత్రీదేవి యైనశ్రీమహా లక్ష్మి. 3. బుద్ధికి, వాణికి, విద్యకు, జ్ఞానమునకు నధిష్ఠాత్రి దేవి యైనసరస్వతి. 4. బ్రహ్మతేజసంపన్న, శుద్ధసత్త్వమయి, బ్రహ్మకు బరమప్రియశక్తి యైనసావిత్రి (గాయత్రి). 5. శ్రీ కృష్ణభగవానుని హృదయేశ్వరి, సంపూర్ణదేవతలయం దగ్ర గణ్య, సర్వలక్షణవిలక్షణ, అనుపమేయ, అతులితసౌందర్య రాశి, సద్గుణసమూహసంపన్న, మధురభక్తిసమన్విత, చిన్మయరూపిణి యైనశ్రీకృష్ణుని ప్రియప్రాణవల్లభ శ్రీరాధ. ఈయైదుమూలప్రకృతులనే సర్వసారస్వరూపలని, పరమాద్య లని, సనాతనశక్తులని, పరమానందస్వరూపిణులని, సకలా రాధ్యలని భక్తులు కీర్తింతురు.

మూలప్రకృతి, యీశ్వరియగునీరాధకళలనుండి కళాం శములనుండి కళాకళాంశములనుండి యనేకపవిత్రశక్తు లుద్భ వించినవి. గంగ, తులసి, మనస, దేవసేన, షష్ఠి, మంగళ చండి, కాళి, పృథ్వి, స్వాహా, స్వధ మొదలగుస్త్రీశిరోమణు లందఱు జనని యగురాధనుండియే ప్రాదుర్భవించిరి. సర్వ

జగములం దున్నసమస్తస్త్రీలు ఈ మూలప్రకృతిశక్తి నుండియే ప్రాదుర్భవించిరి. అందువలన స్త్రీల నవమానించిన ప్రకృతిశక్తినే యవమానించినట్లు భావింపవలెను. (యోషితా మపమానేన ప్రకృతేశ్చ పరాభవః॥ శ్రీబ్రహ్మవైవర్తము - బ్రహ్మఖండము - 30వ అ - 16శ్లో॥).

మూలప్రకృతియగు శ్రీరాధనుండి కమలాలయ యగు రమ ప్రాదుర్భవించెను. అట్లే శ్రీకృష్ణభగవానుడుకూడ రెండురూపముల విభక్తుడైనాడు. దక్షిణభాగము స్వయముగ శ్రీకృష్ణుడు కాగా, వామభాగము చతుర్భుజుడైన శ్రీమన్నారాయణుడయ్యెను. శ్రీకృష్ణపరమాత్మ గోలోకమందును, చతుర్భుజుడైన శ్రీమన్నారాయణుడు వైకుంఠమందును విరాజిల్లెదరు. శ్రీకృష్ణుని వామభాగమునుండి ప్రాదుర్భవించిన శంకరభగవానుడు శివలోకమందు గొలువుండును. గోలోక, వైకుంఠ, శివలోకము లప్రాకృతాకాశమం దున్నదివ్యచిన్మయాక్షరలోకములు. జననియగు రాధయందు శ్రీకృష్ణుడు తన యఖండదివ్యతేజమును ప్రవేశింపజేయగా నామెనుండి యొక మహాడింభ ముద్భవించెను. ఆ మహాడింభమే మహావిరాట్పురుషునిగ బరిణామమొందెను. ఆ విరాట్పురుషుడు స్థూలములలో స్థూలతముడు. శ్రీరాధాకృష్ణనందనుడైనయాయన రోమకూపములందే యసంఖ్యాకబ్రహ్మాండములు వర్తమానములై యున్నవి. ప్రతిబ్రహ్మాండము క్షుద్రవిరాట్పురుషు

డైనవిష్ణువునం దుండును. భగవంతుడు సృష్టిపాలనసంహార కార్యముల కొఱకు బ్రహ్మవిష్ణురుద్రాదులను ప్రత్యేక బ్రహ్మాండమందు నియమించెను.

పరాత్పరపరబ్రహ్మము, పరమాత్మయు, భగవంతుడు నైన శ్రీకృష్ణుని పవిత్రదివ్యచరితముతో శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణ మంతయు నోతప్రోతమై యున్నది. సకలమానవాళిని దరింపజేయుటకే శ్రీకృష్ణుని దివ్యలీలలను వ్యాసమహర్షి శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణమందు వర్ణించెను. ఏకైక పరమతత్త్వము శ్రీకృష్ణు డని, యాయనశక్తి శ్రీరాధయని యీపురాణమందు ప్రతిపాదింపబడెను. భగవంతు డైన శ్రీకృష్ణుడే మహావిష్ణువు, విష్ణువు, నారాయణుడు, శివుడు, గణేశ్వరుడు, కార్తికేయుడు మొదలగువారు. శ్రీరాధాదేవియే దుర్గ, సరస్వతి, మహాలక్ష్మి, సావిత్రి, తులసి మొదలగు సకలదేవీ స్వరూపము.

బ్రహ్మవైవర్తశబ్దమున కర్థ మేమనగ - బ్రహ్మణో వివర్తః (పరిణామః) "బ్రహ్మ వైవర్తః". అందువలన బరబ్రహ్మము పరిణామము చెంది తననుండి యఖిలజగములను సృష్టించెను. సకలచరాచర ప్రాణులకు, జగములకు నాద్యప్రకృతికి బీజము, ఆ పరబ్రహ్మపరమాత్మ యైనశ్రీకృష్ణ భగవానుడే.

శ్లో॥ వివృతం బ్రహ్మకార్త్స్న్యం చ కృష్ణేన యత్ర శౌనక ।
బ్రహ్మవైవర్తకం తేన ప్రవదన్తి పురావిదః ॥
(శ్రీ బ్రహ్మవైవర్తము-బ్రహ్మఖండము-1 వ అ శ్లో-61)

శౌనకమహర్షీ! ఈపురాణమందు శ్రీకృష్ణభగవానుడు తన పూర్ణబ్రహ్మస్వరూపమును వివృత (ప్రకటిత) మొనరించెను. అందువలననే పురాణవేత్తలీపవిత్రసంహితను శ్రీబ్రహ్మవైవర్తమని కీర్తించిరి.

బ్రహ్మ యనగ సకలసృష్టిబీజస్వరూపుడైనభగవానుడు (God), వైవర్త మనగ సకలజగన్నిర్మాణశీలమైన ప్రకృతి (Nature). ప్రకృతిభగవంతుల దివ్యచరితవిశదవర్ణనమే యీ శ్రీబ్రహ్మ వైవర్తమహాపురాణము (This Scripture is the elaborate history of God and Nature). బ్రహ్మ మనగా సకలచరాచరజీవరాసులకు దండ్రి, వైవర్త మనగా దల్లి. మన తలిదండ్రుల పవిత్రదివ్యచరితమే యీ శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణము.

ప్రాకృతాకాశమున కావల జిన్మయవ్యోమములో విరాజిల్లు దివ్యగోలోకపరంధామమున సకలదేవతలేకత్రితులై కార్తికపౌర్ణమీ శుభసమయమున జననియగు శ్రీ రాధాదేవి మహోత్సవము లొనరింప నారంభించిరి. ఆ మహోత్సవములో బ్రహ్మప్రేరితుడై మహాదేవుడు శ్రీరాధా

కృష్ణులను ప్రస్తుతించుచు దివ్యగాంధర్వగాన మొనరించెను. ఆ పరమభాగవతోత్తముని మధురగానలహరులకు సకలదేవతలు మైమఱచి మూర్ఛిల్లిరి. వారు మరల మూర్ఛనుండి మేల్కాంచి సకలగోలోకమును జలమయముగ దర్శించి శ్రీరాధాకృష్ణులను గానక యాశ్చర్యచకితులై చింతాక్రాంతులైరి. మహాదేవుని దివ్యహరినామసంకీర్తనకు ప్రసన్నులై శ్రీరాధాకృష్ణులు ద్రవించి జలరూపమున గోలోకము నాప్లావిత మొనరించినారని జగద్విధాతయగు బ్రహ్మ గ్రహించి మరల దమ దివ్యసందర్శన మొసంగవలసినదిగ జగన్మాతాపితరుల ననేకవిధముల బ్రార్థించెను. శ్రీరాధాకృష్ణులు బ్రహ్మదేవు నిట్లాదేశించిరి. "బ్రహ్మదేవా! వేదముల కంగభూతము, విశిష్టమంత్రసమన్వితము, పరమమనోహరమైన మా యిర్వురి దివ్యచరితసమన్వితమై, స్తోత్రధ్యాన పూజావిధాన మంత్రకవచయుక్తమైన మహాపురాణమును మహాదేవునిచే బ్రవచింప జేయుము. స్వయముగ శంకరుడే యట్టి దివ్యపురాణమును బ్రవచించెద నని ప్రతిజ్ఞ యొనరించిన మేము మరల సాక్షాత్కరింపగలము".

శ్రీరాధాకృష్ణులనాజ్ఞ శిరోధార్యముగ నెంచి శంకరుడు శ్రీరాధాకృష్ణాంగ సంభవములై గోలోకమందు బ్రవహించు జలములను హస్తములం దిడుకొని యట్టిదివ్యచరితమునే బ్రవచించెదనని ప్రతినగావించెను. మహాదేవుడు

హస్తములందు ధరించి ప్రతినగావించిన జలములే పవిత్ర గంగాజలములు. శివుడు ప్రతిజ్ఞ యొనరింపగనే సకలవిశ్వము లకు జననీజనకులైన శ్రీరాధాకృష్ణులు దేవసభామధ్యములో సాక్షాత్కరించి దమ దివ్యదర్శన మొసంగిరి. ఆపరమ పురు షుని, ఆ పరాశక్తిని గన్నుల కఱవుదీర దర్శించి బ్రహ్మశివాది దేవత లందఱు బ్రహ్మానందభరితులైరి. తా నొనరించిన బ్రతిజ్ఞను బాలించుటకు మహాదేవుడు బ్రహ్మదేవునితో గలసి శ్రీకృష్ణపరమాత్మదివ్యముఖారవిందమునుండి శ్రీబ్రహ్మ వైవర్తమహాపురాణతత్త్వరహస్యములను శ్రవణ మొనరించి ప్రథమమున నీ సంహితను సమగ్రగ్రంథరూపమున బ్రవచిం చెను. శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణమును ప్రప్రథమమున బ్రహ్మదేవుడు ధర్మదేవత కుపదేశించెను, ఆయన శ్రీమన్నా రాయణఋషీంద్రున కుపదేశించెను.

శ్లో॥ నారాయణర్షిర్భగవాన్ప్రదదౌ నారదాయ చ ।
నారదో వ్యాసదేవాయ ప్రదదౌ జాహ్నవీతటే ॥

(శ్రీబ్రహ్మవైవర్తము-బ్రహ్మఖండము-1, 64)

శ్రీనారాయణఋషి శ్రీబ్రహ్మవైవర్తమును నారద దున కుపదేశింపగా నారదమహర్షి శ్రీకృష్ణద్వైపాయన వ్యాసునకు బ్రసాదించెను. వ్యాసమహర్షి శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణమును బదునెనిమిదివేల శ్లోకములలో ఛందో

బద్ధ మొనరించి సకలవిశ్వకళ్యాణార్థమై మానవాళికి ప్రసాదించెను. ఇదియే శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణ సంభవ చరితము.

ఈదివ్యపురాణమందుభగవద్భక్తి, యోగములు,సదాచారములు, వైష్ణవులయొక్క, భక్తులయొక్క మహిమలు, మనుష్యధర్మములు, నారీధర్మములు, పతివ్రతాలక్షణములు, అతిథిసేవ, గురుమహిమ, జననీజనకులమహిమ, రోగవిజ్ఞానము, స్వాస్థ్యనియమములు, లాభదాయకౌషధములు, వృద్ధత్వమును నివారించుసాధనములు, ఆయుర్వేదమును గుఱించి పదునల్వురు నాచార్యులు నిర్మించిన వైద్యగ్రంథములు, భౌగోళికవిజ్ఞానము, అణువిజ్ఞానము, కాలజ్ఞానము, బ్రహ్మాండవర్ణనము, దివ్యలోకములవర్ణనము, భక్ష్యాభక్ష్య, శకునాపశకున, పాపపుణ్యావర్ణనములు మొదలగువిషయము లత్యంత విపులముగ వర్ణింపబడినవి. ఇవియేగాక చమత్కారపూర్ణము లైనయనేకసిద్ధమంత్రములను, తన్మంత్రానుష్ఠానక్రమములను, సకలదేవతాధ్యానములను, స్తోత్రములను, కవచములను శ్రీవ్యాసమహర్షి ఈదివ్యపురాణమందు ప్రతిపాదించెను. అనేక సూక్తులుకూడ నీగ్రంథమందు వర్ణింపబడినవి.

ఈపవిత్రదివ్యపురాణమందు నాల్గుఖండములు గలవు.

1. బ్రహ్మఖండము 2. ప్రకృతిఖండము 3. గణపతిఖండము
4. శ్రీకృష్ణజన్మఖండము.

శ్లో॥ బ్రహ్మఖణ్డే సర్వబీజం పరబ్రహ్మనిరూపణమ్ ॥
తతః ప్రకృతిఖణ్డే చ దేవీనాం చరితం శుభమ్ ॥
తతో గణేశఖణ్డే చ తజ్జన్మ పరికీర్తితమ్ ॥
శ్రీకృష్ణజన్మఖణ్డం చ కీర్తితం చ తతః పరమ్ ॥

(శ్రీబ్రహ్మవైవర్తము-బ్రహ్మఖండము 1-అ)

బ్రహ్మఖండమం దంతయు సకలబీజస్వరూప మైన పరబ్రహ్మపరమాత్మ (శ్రీకృష్ణభగవానుని) దివ్యతత్త్వనిరూపణము కలదు. ప్రకృతిఖండమందు దివ్యదేవాంగనల శుభచరిత వర్ణనములు కలవు. గణపతిఖండమందు గణేశ్వరుని ప్రాదుర్భావాదివృత్తాంతములు వర్ణింపబడినవి. శ్రీకృష్ణజన్మఖండమం దాభగవంతుని దివ్యావతారలీలావర్ణనములు గలవు.

శ్లో॥ వన్దే కృష్ణం గుణాతీతం పరం బ్రహ్మాచ్యుతం యతః ।

పరబ్రహ్మము, పరమాత్మ, గుణాతీతుడు, అచ్యుతుడు నగు శ్రీకృష్ణున కివే నా వందనములు.

శ్లో॥ ఆవిర్బభూవుః ప్రకృతి బ్రహ్మవిష్ణుశివాదయః ।

ప్రకృతి బ్రహ్మ శివాదు లందఱు శ్రీకృష్ణుని నుండియే యావిర్భవించిరి.

విశ్వమందు ప్రకృతిస్థితుడైనపరమాత్మ, ప్రకృతి అష్టాదశకళలతో విరాజిల్లుచుందురు. ఆ కళలను వర్ణించుటకే పదునెనిమిది పురాణము లావిర్భవించినవి.

1. బ్రహ్మపురాణము 2. పద్మపురాణము 3. వైష్ణవపురాణము 4. వాయుపురాణము 5. శ్రీమద్భాగవతపురాణము 6. నారదపురాణము 7. మార్కండేయపురాణము 8. అగ్నిపురాణము 9. భవిష్యపురాణము 10. శ్రీ బ్రహ్మవైవర్తమహాపురాణము 11. లింగపురాణము 12. వరాహపురాణము 13. స్కందపురాణము 14. వామనపురాణము 15. కూర్మపురాణము 16. మత్స్యపురాణము 17. గరుడపురాణము 18. బ్రహ్మాండపురాణము.

సృష్టివిజ్ఞానప్రతిపాదకములైనవిజ్ఞానశాస్త్రములే పైనుదహరింపబడిన పదునెనిమిదిపురాణములు. ఈపురాణములందు దశమస్థానమును శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణ మలంకరించెను. ఈపురాణమందు బదునెనిమిదివేల శ్లోకములు గలవు.

భగవంతుని యవతారదివ్యలీలలందు రాధాదేవి శ్రీదాముని శాపమువలన భారతవర్షమం దవతరింపవలసివచ్చెను. శ్రీకృష్ణుని వీడి భూమిపై నవతరించుసమయమున రాధ విచారమును బ్రకటింపగా గృష్ణు డామెతో నిట్లనెను. "రాధా!

నీవే నా శక్తిస్వరూపము. నేను సదా నీయందే యనురక్తి గలిగియుందును. నీవు మూలప్రకృతివి, యీశ్వరివి. నీ నామము, దేహము, కర్మలు మొదలగునవి యన్నియు దివ్యములు. నీవు త్రిగుణాత్మికవు, నేను నీ యాత్మను. దేవీ! నీ సంయోగమును బొందియే నేను చైతన్యవంతుడనైతిని. శరీరము లేనిదే యాత్మ యెట్లుండును? ఆత్మ లేనిదే శరీర మెట్లుండును? నీవు లేనిదే నే నదృశ్యుడను నేను లేనిదే నీవు లేవు. మన కిరువురకు భేదము లేదు.

శ్లో॥ యథా క్షీరే చ ధావల్యం దాహికా చ హుతాశనే ।
భూమౌ గన్ధో జలే శైత్యం తథా త్వయి మమ స్థితిః ॥
ధావల్యదుగ్ధయోరైక్యం దాహికానలయోర్యథా ।
భూగన్ధజలశైత్యానాం నాస్తి భేదస్తథాఽఽవయోః ॥
(శ్రీబ్రహ్మవైవర్తము--శ్రీకృష్ణజన్మఖండము 6.217-6-218)

క్షీరములందు ధవళత్వము, అగ్నియందు దాహకశక్తి, పృథ్వియందు గంధము, జలములందు శీతలత్వము నుండునట్లు నాయందు నీవు మిళితవై యున్నావు. అవి భేదాభావరూపమున నైక్యములై యున్నట్లు పురుషప్రకృతుల మైనమన యందు భేదము లేదు.

శ్లో॥ మయా వినా త్వం నిర్జీవా చాదృశ్యోఽహం త్వయా వినా ॥
స్వయమాత్మా యథా నిత్యస్తథా త్వం ప్రకృతిః స్వయమ్ ।

సర్వశక్తి సమాయుక్తా సర్వాధారా సనాతనీ ॥
మమ ప్రాణసమా లక్ష్మీర్వాణీ చ సర్వమఙ్గలా ।
బ్రహ్మేశానన్తధర్మశ్చ త్వం మే ప్రాణాధికా ప్రియా ॥

అయోనిసంభవా త్వం చ భవితా గోకులే సతి ।
అయోనిసంభవోఽహం చ నాఽఽవయోర్గర్భసంస్థితః ॥

నేను లేనిదే నీవు నిర్జీవము; నీవు లేనిదే నే నదృశ్యు డను. స్వయముగ నాత్మనైన నే నెట్లు నిత్యుడనో యట్లే సాక్షాత్తుగ ప్రకృతిస్వరూపిణి వైననీవు నిత్యవే. నీయందు సమస్తశక్తులు సమన్వితములై యున్నవి. నీవు సర్వాధార మైన సనాతనశక్తివి. లక్ష్మి, సరస్వతి, పార్వతి, శివుడు, బ్రహ్మ, ఆదిశేషుడు, మొదలగువా రందఱు నాకు ప్రాణసమా నులు. కాని నీవు నాకు నా ప్రాణములకంటే నధికప్రియు రాలవు. సతీ! నీవు గోకులమం దయోనిజవుగ నుద్భవింపుము. నేనుగూడ నయోనిజుడనై స్వయముగ నవతరించెదను. నిత్యుల మైనమనకు గర్భస్థితి కలుగ దని గ్రహింపుము.

శ్రీకృష్ణపరమాత్మ మధురలో దేవకీవసుదేవులకు దివ్యపుత్రునిగా నవతరించి గోకులమునకు జని యశోదానందు లకు గారాలపట్టియై యనేకదివ్యలీలల నొనరించెను. గోకుల బృందావనమం దాసర్వేశ్వరుడు జననియగురాధా సహిత గోపికలతో మధురరాసక్రీడల నొనరించెను. ఆదివ్య

మధురలీలల విశదవర్ణనమే యీ వైష్ణవజనప్రాణప్రియ మైన మహాపురాణమందు ప్రతిపాదింపబడెను. గోలోకమందు గోకులములో శ్రీరాధాకృష్ణు లొనరించిన దివ్యలీలాచరితము లతో నీ పురాణము సంపూర్ణముగ నోతప్రోతమై యున్నది. ఈపురాణమందు పురాణలక్షణానుసారముగ నన్యాన్యోప యోగవిషయములను గుఱించియు యథేష్టవర్ణనము కలదు.

శ్రీకృష్ణ, నారాయణ, విష్ణు, శ్రీరామ, శివ, రాధాది దివ్యనామముల యుత్పత్తి, వారి మాహాత్మ్యములు ఈపురాణమందు వర్ణింపబడినవి. ఎందఱో ప్రసిద్ధపురుషుల పూర్వజన్మేతిహాసములు వర్ణింపబడినవి. ఈయితిహాసముల వలన మానవుల హృదయములం దంకురించు శంకలకు సమా ధానములు లభించును. శ్రీకృష్ణుని నారాధించి ధన్య లైన విప్రపత్నులు పూర్వజన్మములందు సప్తర్షి పత్నులని, ధేనుకా సురుడు బలిచక్రవర్తికుమారు డైనసాహసికు డని, కుబ్జ శూర్పణఖయని, ప్రద్యుమ్నుడు మన్మథుడని, మిథ్యావాసు దేవు డైనశృగాలుడు సుభద్రు డనుభగవంతుని ద్వార పాలకుడని, రాయణపత్ని యైనరాధ బృందాదేవి యనియీ మొదలగు రహస్యము లెన్నియో శ్రీకృష్ణజన్మఖండములో విపులముగ వర్ణింపబడినవి.

పాఠకులారా! భగవంతుడు సదా భక్తాధీను డని శ్రీ బ్రహ్మవైవర్తమందు నిరూపింపబడినది.

శ్లో॥ ధ్యాయన్తే వైష్ణవాః శశ్వద్గోవిన్దపదపఙ్కజమ్।
ధ్యాయతే తాంశ్చ గోవిన్దః శశ్వత్తేషాం చ సన్నిధౌ ॥
సుదర్శనం సంనియోజ్య భక్తానాం రక్షణాయ చ ।
తథాఽపి నహి నిశ్చిన్తోఽవతిష్ఠేద్భక్తసంనిధౌ॥
(శ్రీబ్రహ్మవైవర్తము-బ్రహ్మఖండము 11. 44-45)

వైష్ణవజనులు సదా గోవిందుని పదపంకజములనే ధ్యానింతురు. గోవిందుడు సదా యాభక్తుల చెంతనే విరాజిల్లుచు వారినే ధ్యానించును. ఆ భక్తుల రక్షణకొఱకు సుదర్శనచక్రమును నియమించినను బరంధాముడు తృప్తిచెందక తానే స్వయముగ భక్తులచెంత నివసించును.

వైష్ణవభక్తుల స్వరూపము, మాహాత్మ్యము నెట్లు వర్ణింపబడెనో యవధరింపుడు.

శ్లో॥ అవైష్ణవా ద్ద్విజాద్విప్ర చణ్డాలో వైష్ణవో వరః।
సగణః శ్వపచో ముక్తో బ్రాహ్మణో నరకం వ్రజేత్ ॥
(బ్రహ్మఖండము 11.39)

అవైష్ణవుడైన బ్రాహ్మణునికంటే వైష్ణవుడైనచండాలుడే పరమశ్రేష్ఠుడు. ఎందువలెననగా వైష్ణవుడైనచో చండాలుడును భక్తిప్రభావమువలన దన బంధుమిత్రాది

సహితముగ భవబంధవిముక్తుడు కాగలడు. భక్తిహీనుడైన వాడు బ్రాహ్మణు డైనను నరకమును బొందగలడు.

శ్లో॥ యచ్చక్షుః పతినేనైవ బ్రహ్మణః పతనం భవేత్ ।
తద్బ్రహ్మత్వం స్వప్నతుల్యం కృష్ణభక్తో న చేచ్ఛతి ॥
ఇన్ద్రత్వమమరత్వం వా సిద్ధయోగాదికం శివ ।
జ్ఞానం మృత్యుంజయాద్యం వా నహి భక్తస్య వాంఛితమ్ ॥
సాలోక్యసార్ష్టిసామీప్యసాయుజ్యం శ్రీహరేరపి ।
తత్ర నిర్వాణమోక్షం చ నహి వాఞ్ఛన్తి వైష్ణవాః ॥
శశ్వత్ సుదృఢా భక్తిర్హరిదాస్యం సుదుర్లభమ్।
స్వప్నే జాగరణే భక్తా వాఞ్ఛన్త్యేవం వరం వరమ్॥

(బ్రహ్మఖండము 11.33-36)

భగవంతుని రెప్పపాటుకాలములోనే పతనమగు బ్రహ్మపదము స్వప్నమువలె మిథ్య, క్షణభంగురము. శ్రీ కృష్ణభక్తు లట్టిబ్రహ్మపదమును వాంఛింపరు. ఓ శివా! ఇన్ద్రత్వము, అమరత్వము, సర్వసిద్ధులు, మృత్యుంజయ జ్ఞానాదులను సహితము వైష్ణవులు వాంఛింపరు. శ్రీహరి సాలోక్య, సార్ష్టి, సామీప్య, సాయుజ్యాది నిర్వాణమోక్ష ములను గూడ వైష్ణవులు కాంక్షింపరు. భగవంతునియందు సుదృఢభక్తి, శ్రీహరి పరమదుర్లభ దాస్యసౌభాగ్యములు

ప్రాప్తింపవలెనని నేను జాగ్రత్స్వప్నావస్థలయందు గూడ నభిలషించు శ్రేష్ఠవరములు. ఈ శ్రేష్ఠవరములను బ్రసాదింప వలసినదిగ బరమవైష్ణవుడైనగంధర్వరాజు శంకరు నర్థించెను. ఈ ప్రసంగమును మీరు తంత్రెండవ యధ్యాయమందు బ్రహ్మఖండములో బఠించెదరు గాక. భగవంతుని స్మరణ మాత్రముననే జీవునకు నంతర్బహిశ్శుద్ధి లభించును.

శ్లో॥ అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।
యః స్మరేత్పుణ్డరీకాక్షం స బాహ్యాభ్యన్తరః శుచిః ॥
(బ్రహ్మఖండము 17-17)

అపవిత్రులైనను, బవిత్రులైనను, జీవు లేయవస్థయం దున్నను నెవరు భగవంతు డగుపుండరీకాక్షుని స్మరించెదరో వారు సర్వదా అంతర్బహిశ్శుద్ధులు కాగలరు.

భగవంతుని సేవయందు మనలను నియమించువారే నిజమైన యాత్మీయులని శ్రీనారదమహర్షి యిట్లు పల్కుచున్నాడు.

శ్లో॥ విహాయ హరిదాస్యం చ విషయే యన్మనశ్చలమ్ ।
దుర్లభం మానవం జన్మ భవేత్తస్య నిష్ఫలమ్ ॥
కా వా కస్య ప్రియా పుత్రో బన్ధుః కో వా భవార్ణవే ।
కర్మోర్మిభిర్యోజనా చ తదపాయో వియోజనా ॥

సుకర్మ కారయేద్యో హి తన్మిత్రం స పితా గురుః।
దుర్బుద్ధిం కారయేద్యో హి స రిపుశ్చ కథం పితా॥

(బ్రహ్మఖండము 14.33-35)

ఎవరి మనస్సు శ్రీహరిదాస్యమును వీడి విషయవాంఛలకొఱకై చంచలమగునో వారి దుర్లభమగుమానవ జన్మ వ్యర్థమైనట్లే. ఈభవసాగరమం దెవరెవరికి బత్ని, యెవరెవరికి బుత్రుడు, ఎవరెవరికి బంధువు కాగలరు? కర్మతరంగములు ప్రాదుర్భవింపగనేవీరిసంయోగము సంప్రాప్తమగును. ఆకర్మతరంగములు శాంతింపగనే వియోగము సంభవించును. ఎవరు సత్కర్మలను (భగవంతుని భక్తిసేవలను) మనచేత నొనరింపజేయుదురో వారే సత్యముగ మిత్రులు, తండ్రి, తల్లి, గురువు మొదలగువారు. దుర్బుద్ధిని (విషయసేవనములం దాసక్తిని) కలుగజేయు వాడే శత్రువు. అట్టివాడు తండ్రియైనను, దండ్రియని యెట్లనగలము?

శ్లో॥ స కిం గురుః స కిం తాతః స కిం పుత్రః స కిం సఖా ।
స కిం రాజా స కిం బన్ధు ర్న దద్యాద్ యో హరౌ మతమ్ ॥

(బ్రహ్మఖండము - 11వ అధ్యాయము)

శ్రీహరిసంకీర్తన మొనరింపు డని ప్రబోధింపని తలిదండ్రులు, గురువు, పుత్రులు, సఖులు, ప్రభువు, బంధువులు మొదలగువారు నిజముగ శ్రేయోభిలాషులు కారు.

సమస్తరోగములకు పాపములే కారణ మైనందున భారతవర్షములో మహాత్ములు పాపముల నాచరింపరని బ్రహ్మఖండమందు బదునాఅవయధ్యాయమున నెట్లునిరూపింపబడెనో శ్రవణమొనరింపుడు.

శ్లో॥ పాపేన జాయతే వ్యాధిః పాపేన జాయతే జరా ।
పాపేన జాయతే దైన్యం దుఃఖం శోకో భయంకరః ॥
తస్మాత్ పాపం మహావైరం దోషబీజ మమఙ్గలమ్ ।
భారతే సతతం సన్తో నాచరన్తి భయాతురాః ॥

పాపాచరణమువలననే రోగములు సంభవించును; పాపములవలననే వార్థక్యము సంప్రాప్తించును, పాపకర్మల ఫలస్వరూపముగనే దైన్యము, దుఃఖములు, భయంకరశోకములు సంభవింపగలవు.

అందువలననే భారతవర్షమందు భక్తులైనమహాత్ములు పాపముల నాచరింపరు. వారు పాపములన్న విపరీతముగ భయము నొందెదరు.

హృదయమున గాపట్యమును నిలుపుకొని పూజ్యులను సేవింపనివారు మహాపాపులని వ్యాసమహర్షి గణపతిఖండమున నలుబదినాల్గవయధ్యాయమున వర్ణించెను.

శ్లో॥ పితరం మాతరం భార్యాం గురుపత్నీం గురుం పరమ్ ।
యో న పుష్ణాతి కాపట్యాత్ స మహాపాతకీ శివ ॥

శివా! కాపట్యముతో దలిదండ్రులను, భార్యను, గురుపత్నిని పరమగురువును సేవించి పోషింపనివారు మహాపాపులనబడెదరు.

గణపతిఖండములో నలుబదినాల్గవయధ్యాయమున వేదములే శాస్త్రములందు శ్రేష్ఠములని, దైవములందు శ్రీకృష్ణపరమాత్మయే సర్వశ్రేష్ఠుడని, పవిత్రతీర్థములందు గంగయే సర్వోత్కృష్టయని, సకలపుష్పములందు దులసియే పరమోత్కృష్టమగు పూజాకుసుమమనిమహావిష్ణువు ధ్రువీకరించెను.

శ్లో॥ నాస్తి వేదాత్ పరం శాస్త్రం న హి కృష్ణాత్ పరః సురః ।
నాస్తి గఙ్గాసమం తీర్థం న పుష్పం తులసీ-పరమ్ ॥

ధర్మస్వరూపమైన సత్యమును రక్షించుటకొఱకే త్యాగమొనరింపవలెనని శ్రీరామచంద్రుడు శోకవిహ్వాలుడైన దశరథునితో వనగమనసమయమున వివరించినట్లు శ్రీకృష్ణజన్మఖండమున నలువదిరెండవఅధ్యాయమునవర్ణింపబడెను.

శ్లో॥ నహి సత్యా త్పరో ధర్మో నానృతాత్ పాతకం పరమ్ ।
నహి గఙ్గాసమం తీర్థం న దేవః కేశవాత్ పరః ॥

నాస్తి ధర్మాత్ పరో బన్ధుర్నాస్తి ధర్మాత్ పరంధనమ్ ।
ధర్మాత్ ప్రియః పరః కో వా స్వధర్మం రక్ష యత్నతః ॥

స్వధర్మే రక్షితే తాత శశ్వత్సర్వత్ర మఙ్గలమ్ ।
యశస్యం సుప్రతిష్ఠా చ ప్రతాపః పూజనం పరమ్ ॥
చతుర్దశాబ్దం ధర్మేణ త్యక్త్వా గృహసుఖం భ్రమన్ ।
వనవాసం కరిష్యామి సత్యస్య పాలనాయ తే ॥

తండ్రీ! సత్యమును మించినధర్మము మఱియొకటిలేదు. అసత్యమును మించినపాపము లేదు. కేశవుని మించిన దేవుడు లేడు. గంగను మించినతీర్థము లేదు. ధర్మమును మించిన బంధువు కాని, ధనముకాని లేవు. శ్రేష్ఠపురుషులకు ధర్మముకంటె నధికప్రియులు మఱియెవ్వ రుండగలరు? అందువలన మీరు మీ సత్యవాక్పరిపాలన మనుస్వధర్మమును రక్షింపుడు.

తండ్రీ! స్వధర్మమును రక్షించుకొనిన సదా సర్వమంగళములు కలుగును. యశము, ప్రతిష్ఠ, ప్రతాపము, పూజ స్వధర్మరక్షకులకు లభింపగలవు. నేను బదునాల్గు వర్షములు గృహమును బరిత్యజించి ధర్మపూర్వకముగ మీ సత్యవ్రతమును బరిపాలించుటకై వనవాస మొనరింతును.

తండ్రికంటే జనని నూఱురెట్లధికముగ బూజనీయు రాలనెడు పరమసత్యము శ్రీకృష్ణజన్మఖండములో డెబ్బది రెండవయధ్యాయమున నిట్లు వర్ణింపబడినది.

శ్లో॥ సర్వేషామపి పూజ్యానాం పితా వన్ద్యో మహాన్ గురుః ।
పితుః శతగుణైర్మాతా గర్భధారణపోషణాత్ ॥
మాతా చ పృథివీరూపా సర్వేభ్యశ్చ హితైషిణీ ।
నాస్తి మాతుః పరో బన్ధుః సర్వేషాం జగతీతలే ॥

సమస్తపూజనీయులందు దండ్రి యత్యంతవందనీయుడు; కాని నవమాసములు గర్భమున ధరించి పాలించి పోషించుజనని తండ్రికంటే నూఱురెట్లు వందనీయురాలు. తల్లి పృథ్వీసమానమైనక్షమాశీలవతి. సర్వులకు సమముగ హితైషిణి. అందువలన నీజగతీతలమందు దల్లికంటే సన్నిహితుడైన బంధువు మఱియొకడుండబోడు.

పురుషులకు బదునార్గురు తల్లులు కలరని శ్రీకృష్ణజన్మఖండములో నేబదితొమ్మిదవ యధ్యాయమున నిట్లు వర్ణింపబడెను.

శ్లో॥ గురుపత్నీ రాజపత్నీ దేవపత్నీ తథా వధూః ।
పిత్రోః స్వసా శిష్యపత్నీ భృత్యపత్నీ చ మాతులీ ॥

పితృపత్నీ భ్రాతృపత్నీ శ్వశ్రూశ్చ భగినీ సుతా ।
గర్భధాత్రీష్టదేవీ చ పుంసః షోడశ మాతరః ॥

గురుపత్ని, రాజపత్ని, దేవపత్ని, తల్లిసహోదరి, తండ్రిసహోదరి, శిష్యపత్ని, సేవకునిభార్య, మేనమామ భార్య, సవతితల్లి, సహోదరునిపత్ని, భార్యతల్లి, సహోదరి, కుమార్తె, గర్భమున ధరించిన జనని, యిష్టదేవి వీరు పురుషులకు పదునాఱుగురు తల్లులనబడిరి.

ధర్మపత్నిని బాధించువారికిని, సంతానము లేనిస్థితిలో భార్యను త్యజించి సన్యసించువారికిని నిశ్చయముగ నరకము ప్రాప్తింపగలదని శ్రీకృష్ణజన్మఖండములో నూటపదమూడవ అధ్యాయమున నిట్లు వర్ణింపబడెను.

శ్లో॥ అనపత్యాం చ యువతీం కులజాం చ పతివ్రతామ్ ।
త్యక్త్వా భవేద్యః సన్యాసీ బ్రహ్మచారీ యతీతి వా ॥
వాణిజ్యే వా ప్రవాసే వా చిరం దూరం ప్రయాతి యః ।
తీర్థే వా తపసే వాఽపి మోక్షార్థం జన్మ ఖణ్డితుమ్ ॥

శ్లో॥ న మోక్షస్తస్య భవతి ధర్మస్య స్ఖలనం ధ్రువమ్ ।
అభిశాపేన భార్యాయా నరకం చ పరత్ర చ ॥

కులీనయు, పతివ్రతయు యువతియునగు పత్నిని సంతానరహితావస్థయందు వీడి సన్యాసమునుగాని, బ్రహ్మ

చర్యమునుగానీ, యతిత్వమునుగాని స్వీకరించువాడు లేక వ్యాపారనిమిత్తముగాని, ప్రవాసనిమిత్తముగాని పోయి చిరకాలము దూరముగ నుండువాడు, లేక మోక్షముకొఱకుగాని ధర్మముకొఱకుగాని తీర్థవాసియై తాపసుడగువాడు పత్నీశాపమునకు గురియై మోక్షము పొందక ధర్మభ్రష్టుడై పరలోకములో నరకముల ననుభవించును.

భూదేవి తా నేమానవులభారమును వహింపలేక పీడింపబడుచుండునో వారినిగూర్చి ఇటు పలికెను.

శ్లో॥ కృష్ణభక్తివిహీనా యే యే చ తద్భక్తనిన్దకాః ।
తేషాం మహాపాతకినా మశక్తా భారవాహనే ॥
స్వధర్మాచారహీనా యే నిత్యకృత్యవివర్జితాః ।
శ్రద్ధాహీనశ్చ వేదేషు తేషాం భారేణ పీడితా॥
పితృమాతృగురుస్త్రీణాం పోషణం పుత్రపోష్యయోః ।
యే న కుర్వన్తి తేషాం చ న శక్తా భారవాహనే ॥
యే మిథ్యావాదినస్తాత దయాసత్యవివర్జితాః ।
నిన్దకా గురుదేవానాం తేషాం భారేణ పీడితా॥
మిత్రద్రోహీ కృతఘ్నశ్చ మిథ్యాసాక్ష్యప్రదాయకః ।
విశ్వాసఘ్నః స్థాప్యహారీ తేషాం భారేణ పీడితా॥
కల్యాణసూక్తసామాని హరేర్నామైకమఙ్గలమ్ ।
కుర్వన్తి విక్రయం యే వై తేషాం భారేణ పీడితా ॥

జీవఘాతీ గురుద్రోహీ గ్రామయాజీ చ లుబ్ధకః ।
శవదాహీ శూద్రభోజీ తేషాం భారేణ పీడితా ॥
పూజాయజ్ఞోపవాసాదివ్రతాని వివిధాని చ ।
యే యే మూఢా విహన్తారస్తేషాం భారేణ పీడితా ॥

సదా ద్విషన్తి యే పాపా గోవిప్రసురవైష్ణవాన్ ।
హరిం హరికథాం భక్తిం తేషాం భారేణ పీడితా ॥

శ్రీకృష్ణభక్తి రహితులై శ్రీకృష్ణభక్తులను నిందించు మహాపాపాత్ముల భారమును వహించుటలో నేను సర్వదా అసమర్థురాలను. స్వధర్మాచార రహితులను, నిత్యకర్మ విహీనులను, వేదములందు శ్రద్ధలేనివారి భారమును నేను వహింపలేను. తలిదండ్రులను, గురువును, భార్యాపుత్రులను, ఆశ్రితవర్గమును పాలించి పోషింపనివారి భారమును నేను వహింపలేకున్నాను.

పితృదేవా! ఎవ్వరసత్యవాదులో, దయాగుణరహితులో, సత్యాచరణ విహీనులో, గురుజనులను, దేవతలను, నిందింతురో యట్టి పాపుల భారమును నేను వహింపలేను. ఎవరు మిత్రద్రోహులో, కృతఘ్నులో, యసత్యసాక్షులో, విశ్వాసఘాతకులో, యితరుల జీవనాధారములను హరింతురో యట్టిపాపులభారమువలన నేను బీడింపబడుచున్నాను. ఎవరు కళ్యాణకారకసూక్తులను, సామమంత్రములను, హరి

నామమును విక్రయించెదరో యట్టివారి భారమువలన నేను బీడింపబడుచున్నాను. ఎవరు జీవహింసకులో, గురుద్రోహులో, గ్రామయాజకులో, లోభులో, శవదాహకులో, శూద్రాన్నభోజులో యట్టివారి భారమును నేను వహింపలేక పీడింపబడుచున్నాను. ఎవరు మూఢులను బూజించెదరో పూజాయజ్ఞోపవాసవ్రతనియమాదులను భంగమొనరించెదరో యట్టివారి భారమువలన నేను బీడింపబడుచున్నాను. ఎవరు పాపాత్ములో, గోబ్రాహ్మణదైవములను, వైష్ణవులను, శ్రీహరిని, శ్రీహరికథను, శ్రీహరిభక్త్యాదులను ద్వేషించెదరో యట్టివారి భారమువలన నేను బీడింపబడుచున్నాను.

శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణములో ప్రకృతిఖండమందు బ్రతిపాదింపబడిన కొన్ని యమూల్యసూక్తుల నవధరింపుడు.

శ్లో॥ న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః ।
తే పునన్త్యురుకాలేన విష్ణుభక్తాః క్షణాదహో ॥

జలమయతీర్థములే తీర్థములు కావు; విగ్రహరూపులైన, శిలారూపులైన దేవతలే దేవతలు కారు. ఎందువలెననగా దీర్ఘకాలము సేవించినగాని వారు జీవులను బవిత్రులనొనరింపలేరు. అహో! సాక్షాత్తుగ దేవతలు విష్ణుభక్తులే

యని యంగీకరింపవలెను. ఏలయన వారు క్షణమందే యాత్రి తులను బవిత్రులుగ నొనరింపగలరు.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
(13వ అధ్యాయము-శ్లో॥ 29)

ఎవ రేప్రకారము న న్నుపాసించెదరో నే నా ప్రకా రమే వారిసేవలందు తత్పరుడ నై యుండెదను. ఇది నా నియమము. ఈ దివ్యవచనము శ్రీహరి భక్తులకు బ్రసా దించిన అభయము.

శ్లో॥ స్మరన్తి యే యత్ర తత్ర మాం విపత్తౌ భయాన్వితాః।
తాం స్తత్ర గత్వా రక్షామి చక్రహస్త స్త్వరాన్వితః॥
(13వ అధ్యాయము)

విపత్తులయందు భయభీతులై యెవరైనను, నెక్కడ నైనను నన్ను మనఃపూర్వకముగ స్మరింతురో వారిని రక్షిం చుటకు నేను సుదర్శనచక్రధారినై సాక్షాత్కరించెదను.

శ్లో॥ అన్నదానాత్ పరం దానం న భూతం న భవిష్యతి ।
నాత్ర పాత్రపరీక్షా స్యా న్న కాలనియమః క్వచిత్॥
(ప్రకృతిఖండము-27వ అధ్యాయము)

అన్నదానమును మించిన దానము మఱియొకటి లేదు;

ఉండదు; ఉండబోదు. అన్నదానసమయమందు పాత్రా పాత్రవిచక్షణావశ్యకత లేదు. మఱియు సమయనియమము లేదు.

శ్లో॥ ఐశ్వర్యం విపదాం బీజం జ్ఞానప్రచ్ఛన్నకారణమ్ ।
ముక్తిమార్గార్గలం దార్ఢ్యం హరిభక్తివ్యవాయకమ్ ॥
జన్మమృత్యుజరారోగశోకభీతాఙ్కురం పరమ్ ।
సమ్పత్తి తిమిరాన్ధం చ ముక్తిమార్గే చ పశ్యతి ॥

(ప్రకృతిఖండము - 36వ అధ్యాయము)

ఐశ్వర్యము విపత్తులకు బీజము, జ్ఞానప్రచ్ఛన్నకారణము. అందువలన నైశ్వర్యము ముక్తిమార్గమునకు నవరోధము. ఐశ్వర్యమువలన హరిభక్తిమార్గము దడుగడుగున విపత్తులు సంభవింపగలవు. సంపత్తి జన్మమృత్యుజరాశోకరోగములకు సత్తమాంకురము. ధనమదాంధకారమున నంధుడైన మానవుడు ముక్తిమార్గమును గానలేకున్నాడు.

శ్లో॥ మహావిపత్తౌ సంసారే యఃస్మరే న్మధుసూదనమ్ ।
విపత్తౌ తస్య సమ్పత్తి ర్భవేదిత్యాః శఙ్కరః ॥

(ప్రకృతిఖండము - 37వ అధ్యాయము)

ఏపురుషుడు మహావిపత్తిసమయమందు మధుసూద

